శ్రీ రస్తు,

శ్రీ భూనీళా సమేతం శ్రీ చెన్నకేశవ రూపిణమ్।
శంఖ చక్ర గదా పద్మ చతుర్భుజ సమన్వితమ్।
సర్వాభరణ సంయుక్తం వనమాలా విరాజితమ్।
భక్తాభీష్ట ప్రదం నిత్యం వందే పోలూరు సంస్థితమ్॥



శ్రీ గణపతి సతి మొదలిడి వాణీశాద్యమరగణముఁ ప్రార్థించి, సమ
యోగినయి చెన్నకేశవు శ్రీ గురుకృష్ణబ్రహ్మ మనుచుఁ దెలిగి నుతింతున్.
ఓ నమాలు దిద్దిన నాయనాయన వ్రాసి యిచ్చినట్టి - వారు మొదలు
నేటి వరకు నాకు - నీతి విద్యలు నేర్పు వారు గురులౌనస్తు వందనములు.
శ్రీయు భూనీళ శ్రీ చెన్నకేశవ స్వామివారు ప్రీతి సత్కృతి విని
భుక్తి ముక్తులిచ్చి బ్రోచెదమనిరి; శ్రీ విజయ చైత్ర శుక్ల విష్ణుతిథిని॥

రచయిత : విధేయుఁడు - ప్రతాప హనుమయ్య.

శ్రీ విజయనామ సం॥ర చైత్ర శుక్ల ద్వాదశి (1953)

శ్రీరస్తు. — శుభమస్తు.

శ్రీ శివాయ గురవేనమః — శ్రీ చెన్నకేశవస్వామినేనమః

# మనవి

సర్వజ్ఞుండీశ్వరుండనుగ్రహించిన మనుష్యత్వమును, ముముక్షుత్వమును, మహాపురుషాశ్రయత్వమును, సార్థకమగునటుల నప్పరమేశ్వరుండే కరుణించి తనభక్తునిఁ బ్రవర్తింపఁజేయును. సర్వాంతర్యామి భగవంతుఁడు. సర్వశరణ్యుఁడు. సర్వాత్మస్వరూపమే పరమాత్మ. ఆపరమాత్మ దేహాదులయందు జీవాత్మయనఁబడును. జీవులవ్యవహారము 'నేను' అనుపదములేక జరుగదు. అందువలనఁబండితపామరవ్యవహారము సమముగానే కనఁబడును. "పశ్వాదిభిశ్చావిశేషాత్" అనిగదా, అధ్యాసబలము వర్ణింపఁబడినది? నేను దేహధారినై సర్వేంద్రియ వ్యవహారమునకు సాక్షినైనవాఁడను. కనుక భగవద్భజనాదిక మవశ్యము కర్తవ్యమైనది. శ్రీసద్గురుకృపాబలమున భగవత్స్వరూపనిర్ణయమును భక్తిభావనాభ్యాసవశమునఁగనిన దానిని సర్వులకుఁ దెలియఁజేయుట ధర్మమైయున్నది. ఇతిహాసపురాణాదుల ప్రవృత్తికిఁ గారణమిదియేగదా! నాకు భగవంతుఁడొసంగిన భాషాజ్ఞానాది శక్తికొలంది నేనిటులు పద్యరూపమునఁ దత్స్వరూపస్మరణముఁ జేయుచున్నవాఁడను. నేనువ్రాసికొనిన పద్యములందుఁగల తప్పులనుదిద్ది అచ్చుపొరఁబాటులను ప్రూఫ్‌పరిజేయుటకును శ్రమయనుకొనక తీరికచేసికొని, సవరణలు గావించుచున్న బ్రహ్మశ్రీ మిన్నికంటి గురునాథశర్మగారి యుపకృతికి నేనెప్పటికిఁ బ్రతికృతి నొనర్పలేను; కాని శ్రీ భగవంతునిఁగూర్చి శ్రీ శర్మగారికి సంపూర్ణాయురారోగ్య భాగ్యాదులభివృద్ధిగఁ జేయుమని ప్రార్థించెదను.

ఈశతకమును జిత్తగించి తమయభిప్రాయముల నొసంగిన పండితుల కందఱకు నేను సర్వదా కృతజ్ఞుఁడను. ఇందలి గుణాగుణములను విమర్శించి దయతో నాకుఁ దెలుపఁగలందులకుఁ జదువరులను బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,
సుజన విధేయుఁడు,
ప్రతాప హనుమయ్య.

గుంటూరు, బ్రాడీపేట,
వేదసభాకార్యస్థానము
ది 2—9—1956.

శ్రీ దుర్ముఖి సం॥ర శ్రావణ బహుళ త్రయోదశి.

—: శ్రీ శివాయ గురవే నమః :—

# మిత్రప్రశంస

సీ॥ శ్రీ మీరు పోలూరు - గ్రామాధికారియు
పోలూరు గృహనామ-భూసురుండు।
కౌండిన్య ఋషిగోత్ర కలితుఁ డాపస్తంబ
సూత్రుండు శుభగుణ శోభితుండు।
శ్రీ పకీరయ్యగారికిఁ బౌత్రుఁడును. గేశ
వయ్యగారికిఁ దృతీయాత్మజుండు।
దేవ భూసురభక్తి భావుండు వేంకట
సుబ్బయ్యగారికి సోదరుండు।

గీ॥ లక్ష్మీనారాయణాఖ్యఁ జెలంగు భక్తుఁ
డీ శతకమచ్చువేయించె. నీసఖునకు
సతము శ్రీ చెన్నకేశవస్వామి కరుణ
నలరుఁగావుత నిశ్శ్రేయసాభివృద్ధి॥ 1

శా॥ నానా రూపధరుండు విష్ణువు జగన్నాథుండిటన్నిల్చె. శ్రీ
భూ, నీళాయుత చెన్నకేశవ సురూపుండర్చనా వైభవుం
డై నిత్యంబు నిజాశ్రితార్థముల నీయం, దానుఁ బోలూరు ల
క్ష్మీనారాయణు వాంఛితంబులిడి రక్షించు న్గృపాపూర్ణుఁడై॥ 2

కం॥ శ్రీ, భూ, నీళాపరిణయ । వైభవమునుఁ జెన్నకేశవస్వామి నుతిన్
శోభితగతిఁ బ్రకటించిన యా భక్తులకగుత వంశమభివృద్ధి భువిన్॥ 3

క॥ కృతి శ్రీవిష్ణుస్తుతి స । న్మతి ముద్రాపయిత లక్ష్మీనారాయణులీ
క్షితి సత్కీర్తిఁ జెలంగుతఁ। గృతిపతి పోలూరు చెన్నకేశవుకరుణన్

తే॥గీ॥ సప్తసంతానములు పుణ్య-జనకములగు । నందు సుకృతియు
నొకఁడని యందురుగద । సుకృతి సంతానమునుఁగన్న సుకృత
ఫలము । మిగతా యాఱింటిఁ గనఁజేయు మేలొసంగు॥

రచయిత: ప్రతాప హనుమయ్య.

# పండితాభిప్రాయములు

శతకములు తిక్కన కాలమునుండి యారంభమైనవి. తిక్కన దేవకీనందన శతకమునను, పోతన నారాయణ శతకమునను, గొన్ని పద్యములు శృతిగోచరము లగుచుండును. ఆఫక్కికనే ఈ ప్రతాప హనుమచ్ఛాస్త్రికవిగారు భక్తివైరాగ్యాద్వైతములను వెల్లడించు నీశతకమును రచించుటచేఁ గృతార్థుఁడనుటకెట్టి సందియము లేదు ఈశతకమును సాంతముగాఁ జూచితిని. ప్రాచీన కవుల శతకములకెందును దీసిపోదనుటయేగాక నంతకన్న శ్రేష్ఠ్యమన్నను నతిశయోక్తిగాదు. సులభ భాషలో సుబోధకముగా నన్వయక్లిష్టత లేకుండ రచించిన ఈకవి పండిత పామర లోకములకుభయమునకును గృతజ్ఞత వెల్లడించుటకుఁ దగినవాఁడు.

విద్వద్విధేయుఁడు, ఉభయభాషా ప్రవీణ, సిద్ధాన్తి,
గుంటూరు, 1-7.56.
పోలూరు వేంకట సుబ్బయ్యశాస్త్రి,
పండితుఁడు హిందూకాలేజి హైస్కూలు, గుంటూరు.

ఆర్యా! తామంపిన శ్రీ చెన్నకేశవ శతకమును జివర వఱకు జదివితిని శ్రీ చెన్నకేశవుని సన్నిధిలో తాము పురాణించిన శాంధవ్యము అందలి ధర్మకర్తలు, అర్చకులతో తమకుఁ గల పరిచయం సువ్యక్తములు. తాము రచించిన శ్రీ ఘానీళా చెన్నకేశవస్వామికళ్యాణ పద్యములు చక్కగా చెయిదిరిగియున్నవి. ఇందు కథాగమనము, సంవాదములు తీగలు సాఁగినట్లు చదువరులకు సుబోధకములైయున్నవి.

గుంటూరు, 31-8-56.
ఇట్లు - శ్రేయోభిలాషి,
పండిత కవీంద్రుఁడు: కల్లూరి వీరభద్రశాస్త్రి

ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ, కవిశేఖర, శ్రీమదాంధ్ర భాగవతికర్తల అభిప్రాయము

మీపద్యములు చూచి పంపుచున్నాఁడ. దానితో నాయభిప్రాయమునుగూడఁ బంపుమంటిరఁట 'జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జంధ్యంబేలా'

క॥ కలవాఁడవు కవితాకళ । కలవాఁడవు బ్రహ్మవిద్య-ఘనపాండిత్యముం
గలవాఁడవు వాక్చాతురి। కలవాఁడవు బళి! ప్రతాప హనుమచ్ఛాస్త్రీ!
ఇందులకీ శతకమే లక్ష్యము.

విధేయమిత్రము,
గుంటూరు, బ్రాడీపేట, ది 1—9—1956,
మిన్నికంటి గురునాథశర్మ

శ్రీరస్తు. — శుభమస్తు.

శ్రీశివాయగురవే నమః — శ్రీచెన్నకేశవస్వామినే నమః

# శ్రీ చెన్నకేశవ శతకము

ఉ॥ శ్రీయును భూమినీళయు వసింతురు నీయురమందుఁ బ్రక్కలన్
హాయిగ: వారు, భక్తులెవ్వరైనను నిన్ను భజించినంత· దీ
ర్ఘాయువు, శ్రీలు, సౌఖ్యములనామయ సంతతులీయ, వీను, నీ
వే యిడినట్లు నిన్ను నుతియింతురు: పోలురు చెన్నకేశవా!! 1

చ॥ నిను విడనాడి నీసతులు నిల్వఁగ, భక్తులు సేరికొల్వఁగాఁ
గననగు త్రావులేదు విధిగాఁదమకృత్యము మానలేరుగా;
జననలయ స్థితుల్సలుపఁజాలిన శక్తులు వారె గాక, నీ
కనువగునయ్య? సేయ నెవియైనను పోలురు చెన్నకేశవా!! 2

ఉ॥ నేను పురాణముల్నిగట నీపద సన్నిధి విన్నవించితిన్
బూనిక నైన భవత్కథ లపూర్వములన్ విని చెప్పనేర్చితిన్
నేనిఁకఁ జెప్పఁగా విన గ నీకును నాకును దీరఁబోవునా?
కానఁమదిన్నవేయ కృతిగా విను: పోలురు చెన్నకేశవా!! 3

చ॥ త్రివిధములైన నీకు ప్రకృతి న్గనియాడన? నిన్ను వేడనా?
వివిధ విచిత్ర కల్పనల వేషకఁజూడన? నిన్నుఁగూడనా?
అవిరళ దుర్నివార జననాదులఁగూడన? నిన్నుఁగూడనా?
సవిధ విధానము న్దెలుపు. చాలును: పోలురు చెన్నకేశవా!! 4

ఉ॥ మానము నిల్ప ద్రౌపది రమాధవయంచు నుతించె నిన్ను, శ్రీ
మానినిఁబిల్వరాది? యభిమానము గల్గిన యూడు దేగదా!
నేనని యాడువారి పనినిన్నలుప న్బురుషోత్తముండుఁగా
నీ నవనాగరత్వ విధి నెన్నన: పోలురు చెన్నకేశవా! 5

చ॥ చెలియని చూడవచ్చిన కుచేలునకేమి యొసంగి పంపితో
తెలియదె? నీసతీమణి నుతించెనె యాతఁడు గల్మిఁ గోరి? శ్రీ
లలన యొసంగె సంపదలు లక్షలు కోట్లు; తదీయ పత్నికిన్
నిలువున సాక్షినై పలుకనేరవు — పోలురు చెన్నకేశవా! 6

ఉ॥ హాయిగ శేషశాయివయి — యాశ్రితకోటికిఁ జెప్పుమయ్య; న
న్నీయఁగ నేనకాని తరమీయఁగఁ జాలినశక్తిఁ గూర్చినన్
మీయభిలాషమేదయిన మించి యొసంగెదనంచు రూఢిగా
శ్రేయమొ? ప్రేయమో? మనవిఁజేయఁగఁ బోలురు చెన్నకేశవా! 7

ఉ॥ శ్రేయముఁగోరు వారడుగఁ జెల్లును, శక్తియొకింత లేని ని
న్నే యుపయోగమున్నదని యిచ్ఛ నిరంతర సౌఖ్యసిద్ధికై;
ప్రేయము, లోకభోగములఁ బ్రీతిని గల్గినవారు గోరఁగా
నీయఁగనౌను శక్తిఁగని యెంతయు - పోలురు చెన్నకేశవా! 8

చ॥ వరదుఁడవంచు నిన్నొకఁడు భక్తి భజింపుచునుండు నెప్డు; ని
ష్కరుణుఁడవంచు నెంచుచు నొకండతి నిష్ఠుర వైరబుద్ధితోఁ
బరమపవిత్ర! నీస్మరణ భాషణచేష్టలఁ దన్మయుండునౌ
నిరువురియందు నీకు నెవఁడిష్టుఁడు? - పోలురు చెన్నకేశవా! 9

ఉ॥ నిన్ను భజించి నీయది యనిర్వచనీయ విధేయ మాయనే
నెన్ననటన్న నీవు మది నెట్లుగ నెంచెదో? గాని నన్ను నీ
మన్నన మిన్నునం గలుగు మానవ దేవ బలంబులొక్కటన్.
దిన్నగఁ జూచునా? నిజముఁ దెల్పుము - పోలురు చెన్నకేశవా? 10

చ॥ భుజగ శయాన! యన్నవిని పోవుదువీవును భక్తరక్షకై
భుజగ విభూష! యన్నవిని పోవుశివుండును; మీర లిద్దఱున్
భుజగము వాడుకొన్న విధమున్నదలేక భుజంగ మన్నచో
భుజగము భక్తరక్షణకుఁబోవున? పోలురు చెన్నకేశవా! 11

చ॥ నిరుపమ, తావకీన పద నీరజయుగ్మమరందసాంద్ర శ్రీ
కర పరిమార్జితాఖిల జగద్భ్రమ రూపవిశేషతాప్తుఁడై
నిరతము నీస్వరూప పరినిష్ఠిత దివ్యసుఖానుభూతినే
మరనినరుండు ముక్తుఁడనుమానమ? పోలురు చెన్నకేశవా! 12

చ॥ కృతియుగ ధర్మమీకలిని గెల్చిన నీకపకీర్తి గల్గదా?
క్షితిపతి విష్ణునంశమని చెప్పుట యెప్పుడుఁదప్పగాదుగా?
మతియుతమైన మానవ సమాజపుమానము మానమానమా?
మృతిజని నెవ్వరైన విరమింతుర? పోలురు చెన్నకేశవా? 13

చ॥ సకల ముముక్షుకాంక్ష కొనసాఁగ వికుంఠ పదంబునందు నీ
ప్రకృతి సమేత రూపముఁ దిరంబుగనిల్పి, విశేషరూపముల్
వికలతఁగన్న రీతి నవివేకుల దృష్టినిఁదోఁతు వర్చలన్
ప్రకటితమౌను నీదు విభవంబులు పోలురు చెన్నకేశవా? 14

ఉ॥ ఏమహనీయశిల్పి రచియించెనొ నీప్రతిబింబమూర్తి, ము
న్నే మహితాత్ముఁడిందు నినునెట్లు ప్రతిష్ఠితుఁజేయఁగల్గెనో
యేమతిమంతుఁడాలయము నేర్పడ గట్టెనొ వారు ముఖ్యరున్
నీమహిమజ్ఞులందు గణనీయులు పోలురు చెన్నకేశవా! 15

చ॥ ప్రభువులు భూములిచ్చి పరిపాలనఁ జేయుచు నేళతాళముల్
విభవములుత్సవంబులును వేడ్కలు సేవలు నిత్యభోగముల్
శుభమతులై ఘొనర్చిన యశోధనులెన్న, ద్వదీయమాల్య సౌ
రభ సుఖమోదితాత్ముల పరంపర - పోలురు చెన్నకేశవా! 16

చ॥ క్రమముగ ధర్మకర్తలనఁగాఁ దగిపోలురు వారు బ్రాహ్మణుల్
దమ తమశక్తిఁ గూడ నిరతంబు భవత్పద భక్తియుక్తులై
సమయ విశేష సేవలను సల్పుచుఁ బొల్గొనుచుండ్రు వారలన్
సముదిత సౌఖ్యచిత్తులుగ సల్పుదు - పోలురు చెన్నకేశవా! 17

ఉ॥ కార్యఫలంబు లందఱునుఁ గాంచఁగ నిత్యము సేవకార్చకా
చార్య పరంపరన్విభవసాళ్వకు సూత్రి పవిత్ర గోత్ర మా
చార్య సుగోత్రజుల్ శుభవిచారులు పప్పురు వంశసంభవా
చార్యులు నీకు భక్తులు ప్రశస్తులు - పోలురు చెన్నకేశవా! 18

ఉ॥ వారక పూర్వులన్గడవి వచ్చిన నీపదభక్తినావ పో
లూరుననున్న యర్చకులలో రమణయ్యను జల్పతిన్ గృపన్
బారముజేర్చి సంసరణ వారిధిదాటఁగజేసి; తత్సుతుల్
నేఁపుమీరని న్గొలువనేర్చిరి - పోలురు చెన్నకేశవా! 19

చ॥ సలలితభక్తి నిన్ను మనసాస్మరియించుచు నోట స్వచ్ఛమై
నిలిచిన రామకర్ణసుధ నిత్యము వీనుల విందొనర్చు శ్రీ
శైలపతిగారు దక్షిణదిశన్ విలసద్ఘన సాలభంజికా
కలితము గాలిగోపురముగట్టిరి - పోలురు చెన్నకేశవా! 20

ఉ॥ శ్రీరమణయ్య పుత్త్రుఁడగు శేషయ భక్తుఁడు నీకు నిపు శ్రీ
మీర విమాన గోపుర సమేత నవీన దృఢాలయమ్ముఁ బ్రా
కారము, మండపద్వయముగట్టి సతీయుతు నిన్నునః ప్రతి
ష్ఠా రమణీయుఁజేసె, విలసత్కృపఁ - పోలురు చెన్నకేశవా! 21

ఉ॥ ఆరయ నీకృపాబలము నందిన శేషయ, భక్తి నాగమా
చారవిధి న్విరాడ్వైఖనసప్రతిబింబముల న్ప్రతిష్ఠ శ్రీ
మీరనొనర్చె నుత్సవనిమిత్తము విగ్రహ వాహనాదులన్
జేరిచె సల్పుచుండె బ్రతిసేవయు - పోలురు చెన్నకేశవా? 22

ఉ॥ భూషణ వస్త్రమాల్య పరిపూర్ణతనీకు సతీయుతమ్ముగా
వేషము లొప్పఁదీర్చి జరిపించును బెండ్లిఁ బదాఱురోజులన్
శేషయ శేషుఁడే యగుచుఁ జేయును మీపవళింపుసేవ, సం
తోషమె రూపమాయనకుఁ దోడగు పోలురు చెన్నకేశవా? 23

ఉ॥ దార సుతాది బంధువు లుదారమనీషుని శేషయార్యునిన్
జేరి భజించుచుండ నినుఁ జేర్చి భజించు సతంబు వారలన్
గూరిమి నీకటాక్షములకున్ గుఱిసేసి తరింపఁజేయు; ని
ష్కారణమైన ప్రేమ వెదజల్లుచు పోలురు చెన్నకేశవా? 24

చ॥ నినుఁగనినట్లు బుద్ధిఁగమనించి నొసంగును చెన్నకేశవా
ర్పణమని యెద్దియేని సుకరంబుగ నతిథులకెల్ల వేళలన్
బనివడి ధర్మశాల నొకప్రక్కనిల్పెను. శేషయార్యుఁడా
యన పరిచర్యల న్మనమునందుదు పోలురు చెన్నకేశవా? 25

చ॥ పరమపవిత్రు నిన్ను శివభక్తులు, స్మార్తులు, వైష్ణవాదులం
దఱుఁగడు భక్తితో దగు మతంబులరీతిఁ బూజసేయుచుం
దురు నిరతంబు; భక్తవరదుండవు; సర్వము సమ్మతంబుగా
బరగును నీదు సాత్వికపు భావము - పోలురు చెన్నకేశవా!! 26

చ॥ హరికినిఁ దల్లిదండ్రు లెవరైనది చెప్పరు వైష్ణవాగ్రణుల్
హరునకుఁ దల్లిదండ్రుల మహాత్ముల నెన్నరు శైవశేఖరుల్,
హరిహరులిద్దరున్ జననమందుట మిథ్యయటండ్రు స్మార్తులున్
సరగున దెల్పు మిందలి నిజంబును - పోలురు చెన్నకేశవా!; 27

చ॥ హరిహర జన్మ కారణము నారయ లేదనియున్న, నెప్పుడే
కారణినిగల్గెఁ గార్యమెటఁ గారణహీనమటందు; రిందునన్
బరగెను స్వేచ్ఛగా ననిన వారికిఁ గారణమద్ది నిల్చునా
పరమ కృపాంతరంగ! తెలుపందగు - పోలురు చెన్నకేశవా!! 28

ఉ॥ కారణ కార్యరూపము లొకండని చెప్పరు; రెండటన్నచో
వేఱొక సాక్షియుండవలె వీరినెఱింగినవాఁడు. వానికీ
తీ రనవస్థ యానకతీరదు; సర్వమెఱుంగు తెల్వితో
నేరనివారు నిన్నుఁ గననేర్తురె? - పోలురు చెన్నకేశవా! 29

ఉ॥ నీవొకమూర్తివై యెదుటనిల్చిన మాత్రనఁ జూచువారు, తా
మే విధినుండిరో యటులనే నిను నుండఁగఁ జేయఁ జూతు, రి
చ్ఛా విశ్రమింత, దీనిని విచారణచేఁ బసిబాలుఁబోలు నీ
కీ విధరూప మంచనగ నెట్లగు - పోలురు చెన్నకేశవా! 30

చ॥ మొదలొకమూర్తి మాటయును బుద్ధినిబట్టి శ్రుతుల్ వచించుటల్
తుదిమొదలున్న వస్తువులలో నినుఁబోలిచి చెప్పుచుండుటల్
మదిఁగలదానినిక్ స్మరణమాత్రనఁ గన్నులఁజూడఁ జేయుటల్
విదితము లోకమందు మనవిక్ విను - పోలురు చెన్నకేశవా? 31

ఉ॥ మోదమునన్వచించెద సమోఘమఘాపహరంబు, భక్తప్ర
హ్లాద వినోద జీవన సుఖామృత తత్త్వము తత్త్వసిద్ధికై,
భేదవివాదము ల్విడిచిపెట్టి సమస్తము నీవయన్న నిష్
ఖేదమనస్కుఁడద్ది పరికింతువ - పోలురు చెన్నకేశవా! 32

చ॥ దయవిడి తండ్రి మారణ విధానములన్ దను శిక్ష సేయఁగా
నయవినయమ్ముఁజూపి శరణన్ మని యెవ్వరిఁ జేరఁ బోవఁడే
భయముఁగనండు, నిండి భగవంతుఁడయుండు సమస్తమందట,
న్నియమము గల్గు భక్తగణనీయుఁడు - పోలురు చెన్నకేశవా! 33

ఉ: నీదయఁగన్న నారదమునీంద్రుఁడు సేసిన జ్ఞానబోధ ప్ర
హ్లాదుఁడు మాతృగర్భగతుఁడైన తఱిన్విని జ్ఞప్తితోడ, శు
క్రాదుల ధర్మనీతిని ననాదృతిఁజేసియుఁ దండ్రితోడ ప్ర
హ్లాదుల కందరాని పదమందెను - పోలురు చెన్నకేశవా! 34

చ॥ అరయ హిరణ్యనేత్ర సహజాత్మజుఁడీ జగమందుఁ గన్న వి
న్న, రకరకాల రూపములు నామములన్నియుఁ గల్పితంబుల
న్నటి దృఢబుద్ధి సర్వమునదన్నని లోకములందుఁ బూజ్యుఁడై
బరగెఁ ద్వదీయభక్తి విభవంబున - పోలురు చెన్నకేశవా! 35

ఉ॥ ఆతఁడు స్వర్ణనేత్ర సహజాత్మజుఁడైనను, విష్ణుతత్త్వని
ష్ణాతయుగాన నిర్భయసునిశ్చల నిర్మల బుద్ధిశాలియై
ప్రీతియొకింత లేక నడిపించెను రాజ్యము సాక్షిమాత్రుఁడై
నీతిని దేవతల్దనుఁ గణింపఁగ - పోలురు చెన్నకేశవా! 36

చ॥ నరహరిమూర్తివై నిలిచినక్ నినుఁజూచి వికారమందెనా?
ఖరనఖదారితుర్జనకుఁగాంచి విచార మనస్కుఁడయ్యెనా?
వరదుఁడవౌచు నెంత బలవంతముజేసిన నిచ్ఛగించెనా?
వరము నొకింతు, తద్దనుజబాలుఁడు - పోలురు చెన్నకేశవా? 37

ఉ॥ పూనికమై హిరణ్యకశిపుండు విరోధముచేతఁగన్న, త
త్సూనుఁడు భక్తిమిత్రుఁడగుచుక్ గనఁజాలిన నీస్వరూపముక్
ధ్యాన విశేషయోగ్యమగునట్టులుగా నొనరించు మాయ యె
వ్వానిని నేమిసేయదు? కృపాకర! - పోలురు చెన్నకేశవా? 38

ఉ॥ మాయ భవద్విధేయ, యసమాన, యనిర్వచనీయరూప, నా
రాయణి నామధేయ, గుణరమ్య, యగణ్య. సమస్త కల్పనా
హేయపరిక్రియావిలసనేచ్ఛ హృతాయ, మహాప్రభావ! నీ
మాయ నెఱుంగశక్యమ రమాధవ! - పోలురు చెన్నకేశవా! 39

చ॥ కరిమొఱవెట్టఁగా విని యొకండనె కూఁతనుబట్టి పోవఁగా
సురలును మింట్రమొక్కి రతిచోద్యము నీదు ప్రయాణమప్పుడా
గరుడుఁడు శంఖచక్రములె కాయికిగూడెను భక్తరక్షణా
తురతను జూపినావు విబుధుల్ గన - పోలురు చెన్నకేశవా! 40

చ॥ మకరముఁదు)ంచెఁ జక్ర మనుమానములేదిఁక జీవహింసన
ప్రకరణ పుణ్యపాపములవశ్యముఁ జెందుటనీవ? చక్రమా?
సకల విలక్షణాత్మ వది సాధనమైన జడంబుచూడఁగా
వికలతఁ జెందునేమొ విధివేదము? - పోలురు చెన్నకేశవా! 41

ఉ॥ చేసిన పుణ్యపాపములు సెందకపోవను వేదవాక్యముల్
వాసిగ నిల్పుకోఁదగినవాఁడవు; నీవు గజేంద్ర రక్షణక్
జేసినయట్టి పేరుఁగని, చెందదు పుణ్యము పాపమన్నచో
నీసరి వారు లేరని గణింతురె? - పోలురు చెన్నకేశవా! 42

ఉ॥ కర్తకుఁ బుణ్యపాపములు గర్మఫలంబులు సెందుగాని, నేఁ
గర్తను భోక్తఁగానని జగంబుల రక్షణ శిక్షణంబులన్
వర్తిలఁజేయు నీదయిన భావముగాంచిన ధీరులున్న, ని
ర్వర్తిత సర్వకర్మలనవచ్చునె? - పోలురు చెన్నకేశవా! 43

చ॥ కలగనువేళ మానవుఁడు గాంచు పదార్థములెల్ల నిద్రచేఁ
గలిగినవేగదా యనును గర్తయు భోక్తయు సాక్షి తానయై
మెలకువఁ గాంచి చెప్పునుసుమీ! యిఁకజాగరమందు మాయచేఁ
గలుగుననందు నీకృపనుఁ గానక - పోలురు చెన్నకేశవా 44

ఉ॥ నీకృపయే ప్రబోధమగు నీనిజరూపము తెల్వి యాత్మయా
నీకమనీయలోక తతియే భవదాశ్రయమాయ మిథ్యయా,
ప్రాకట సద్వివేక విభవంబున నొప్పు నరుండు సర్వదా
నైకొను నిన్నుఁ గల్పిత జగంబున - పోలురు చెన్నకేశవా! 45

చ॥ ఘటమును మృత్తికన్ విడిచి కాననియట్లు నరుండు మాయచే
ఘటిత జగంబు నిన్విడిచి కాంచుటలేదు; వివేకహీనుఁడై
ఘటపట నామరూపములఁగాంచు మృదాదికి మూలవస్తు స
ద్ఘటనముగా నెఱుంగడు, యథార్థము - పోలురు చెన్నకేశవా 46

ఉ॥ కుండ సెడంగ మృత్తికయు గూడ నశించెననండెవండు; లే
కుండు టెఱుంగు తెల్విఁగని యుండక లేదనియున్ వచింపఁడున్
రెండగు కల్మిలేముల నెఱింగెడు తెల్వి యొకండతానయై
యుండి యెఱుంగ నిన్ననుచునుండును - పోలురు చెన్నకేశవా! 47

ఉ॥ నేనని, లేనిశక్తిని గణించిన కార్యము, పుణ్యపాపముల్
ధీవిరసింపఁబోవున, విధిన్గని వాస్తవమైన కర్తనేఁ
గానని నిర్మలాత్మఁగని గాక, మహాత్మ! భవత్స్వరూప సం
ధానము వేదశీర్ష కథితంబగు - పోలురు చెన్నకేశవా! 48

ఉ॥ శ్రీకరమైన, భక్తజన సేవితమైన, భవత్కథామృతా
స్తోక పవిత్రమైన, నుతితో, శ్రుతితో మతితో నినుఁగనం
గాక నృజన్మ జంతువనఁగా మనఁగా దినఁగా గనఁగ. భూ
లోక సుఖంబెలేదు పరలోకమె? - పోలురు చెన్నకేశవా! 49

చ॥ ప్రతిమలు స్వల్పబుద్ధులగువారికి నేర్పడజేసినట్లుగా
శ్రుతులను విందు మందఱును జోద్యముగా భవదీయ మూర్తులన్
మతినిలువంగఁజేసిన క్రమంబుగరూఢమగున్ సుఖంబుగా;
నితరవిధంబు కష్టమగు నెంతయు - ప్రోలురు చెన్నకేశవా! 50

చ॥ కనుఁగొని పంచదార చిలుకల్ మొదలైనవి యెక్కడేనిఁ గొ
ల్చినఁదినఁ జూచినే పడయురీతిని, నీదగు దివ్యవైభవం
బనఁదగు రూపనామములయందు మనంబెటులైన నిల్పినన్
జనుఁడమృతుండగున్ గనఁడు జన్మము - ప్రోలురు చెన్నకేశవా! 51

ఉ॥ ఏకము దేహమందుగల యింద్రియముల్ పలురీతులైనటుల్
నీకమనీయ రూపమున నిర్జరమానవ జంతు సంతతుల్
ప్రాకృతభేద రూపముల వర్తిలఁగాంచు వివేకశాలి, తాఁ
గైకొను నిన్ను నన్నిట సుఖంబుగ - ప్రోలురు చెన్నకేశవా! 52

చ॥ ఒక పనిఁజేసి, లోకముకు యోగమునుఁగనఁజేసి, దానిచే
సకలమునిట్టులే సులభసాధ్యముగా గ్రహియింపఁజేసి యే
రకముల దేహబుద్ధుల తెఱంగులుగాంచిన వారలట్టులే
సుకరము గాఁగఁజేసికొనఁ జూచెదు - ప్రోలురు చెన్నకేశవా! 53

చ॥ హరుఁడు పురాంతకుండు, మహిషాసురమర్దని యాభవాని, (శ్రీ)
హరి మధుకైటభారి, యమరాధిపుఁ డింద్రుఁడు వృత్రహంత; యీ
వరుసను నందఱున్ దనుజవర్గముఁ జంపఁగ వారిరక్షకై
న్వార నెదో? సర్వరక్షకుఁ డెవండగు! - ప్రోలురు చెన్నకేశవా! 54

చ॥ నెపములఁజంపి రక్కసులనీపదమందునఁజేర్చి నిర్జరుల్
దప మొనరించి నన్నరిదుకు దారిని స్వర్గముగూర్చి, నెమ్మదిన్
గపటముఁ దోఁచనీయక జగంబుల నేలుచు నుందువందు, నీ
కృపఁగనినంత భక్తుఁడెటిగించును - ప్రోలురు చెన్నకేశవా! 55

చ॥ అవని ననేక రూపముల నాశ్రితరక్షణ సల్పినట్లుగా
భవదవతారలీలలన వర్ణ్యము లొప్పెడుఁగాని చెన్నకే
శవ విభవంబు భక్తుల వశంబయి కోరినగోర్కులీయఁగా
నవునని మాత్ర మెన్నఁదగినట్టిది - ప్రోలురు చెన్నకేశవా! 56

చ॥ జనములు గోరుకోర్కెఁ గొనసాగఁగఁజేయు భవద్విధేయమా
యనుఁ గనులారఁగాంచు సమయంబులు స్వప్నము జాగరంబులా!
అనుపమ నిత్యసౌఖ్య మహిమానుభవాత్మ ననన్యరూపు ని
న్ననుఁగొన జ్ఞానకాలమ యొకండగు - పోలురు చెన్నకేశవా! 57

చ॥ నినుఁగొనియాడ నాతరమ నీరజసంభవ ముఖ్యదేవతా
వినుత! మహాప్రభావ! అవివేకినినే నినుఁగూర్చి యెద్దియో
మనవిగఁ జెప్పుకొందు విని - మామకచిత్త విశేషవర్తనం
బును సరిజేసి ప్రోవుము ముముక్షుఁడ - పోలురు చెన్నకేశవా! 58

చ॥ విధి నిదురింపఁగా ప్రళయవేళ జలంబుల వేదతస్కరున్
విధిగ వధించి మేల్కొనిన వేధకు వేదములిచ్చి, నావ నో
షధుల మునీంద్రులన్మనువుఁ జక్కఁగ బ్రోవఁగ వేఁగుదాక వా
రిధినొక మత్స్యమూర్తిగఁ జరింపవ - పోలురు చెన్నకేశవా? 59

చ॥ అమృతముఁ ద్రావు వేడుక సురాసురులందు సమంబుగాఁగ, భా
రమునక మందరాద్రిఁ గొని త్రచ్చబయోధి మునుంగనీని, శ్రీ
కమఠ విశేషమూర్తివనఁగాఁ బొగడొందిననాటి మాట, నే
మమునఁ దలంతుఁ ద్రుంతు ననుమానము-పోలురు చెన్నకేశవా!

చ॥ ధరణినిఁ గొంచువారినిధిఁ దాఁగిన దైత్యు హిరణ్యనేత్రునిన్
బొరిగొని భూమినీటిపయిఁ బొల్పుగనిల్పి; సమస్త యాగస
త్పరికర బంధురావయవపాటవయజ్ఞ వరాహమూర్తినాఁ
బరగిన నిన్ను నెన్నఁగలవాఁడన? పోలురు చెన్నకేశవా! 61

చ॥ కరమరుదైన బ్రహ్మవరగర్వితుఁడైన హిరణ్యనేత్ర సో
దరుఁడెట నిన్నుఁగన్గొనక, తత్సుతు నీప్రియభక్తుహింసలన్
బొరిగొనలేక, వేసరితమోగతిఁగంబముఁదట్టినంతలో
నరహరిమూర్తివై వెలసినాడవు - పోలురు చెన్నకేశవా! 62

ఉ॥ కశ్యపు పుణ్యపుంజమనఁగాఁదగు వామనమూర్తివై, మనో
వశ్య విధేయతన్ బలిసభన్ త్రిపదావనిదానపాత్రతా
వశ్యకత ల్బయల్పఱచి వాస్తవము న్ఘనఁజేసి, సర్వమున్
నశ్యముగాఁగఁజూపి నయనంతుఁడ! - పోలురు చెన్నకేశవా? 63

ఉ॥ శాంతము బ్రహ్మతేజము రజః పరిపూర్ణము రాజధర్మముల్
స్వాంతముగాఁదపః ప్రథిత భార్గవవంశ్యుఁడవై జనించి, క్ష
త్రాంతకమూర్తివై పరశురాముఁడనంగ మెలంగు నిన్ను నా
శాంతయశోవిశాలుఁ గొనియాడుదు - పోలురు చెన్నకేశవా! 64

చ॥ దశముఖ ముఖ్యదైత్యుల వధంబువిధీంద్రుల ప్రార్థనంబుగా
దశరథరామ రూపము నుదారతఁదాల్చి కృతాపరాధులన్
విశసనమున్బొనర్చి పృథివిన్ సుఖమందఁగఁజేసి పుత్త్రులౌ
కుశలవులేలఁజూచిన ముకుందుఁడ - పోలురు చెన్నకేశవా! 65

ఉ॥ ద్వాపరవేళ రాజులగు దైత్యవరాంశులఁ జంపఁ, దాపసుల్
గోపికలై జనింపఁ దమకోర్కి ఫలింపఁగఁ గాఁగిలింప; సం
తాపుల నర్జునోద్ధవులఁ దత్త్వసుధాంబుధిముంప, ద్వారకా
శ్రీపతివైన కృష్ణ! నుతిఁజేయుదు - పోలురు చెన్నకేశవా! 66

ఉ॥ శ్రీబలరామమూర్తియన శేషుని యంశజనింపఁజేసి, గా
రాబపుఁ దమ్ములక్ష్మణుని రాముఁడవై పనిగొన్నయట్లు, మా
యాబలమొప్ప నన్నయని యాతనియాజ్ఞ మెలంగు కృష్ణలీ
లాబహుళాత్మ నిన్మదిఁ దలంతును - పోలురు చెన్నకేశవా! 67

ఉ॥ పాపము జీవహింస, పొరపాటున నైననుఁ గూడదంచు, సం
తాపమునొందు ప్రాణుల మనంబులు సంతసమందఁ జేయఁగా
నోపినఁ బుణ్యమంచు, సమయోచిత సౌఖ్య దయా ప్రభావముల్
చూపినబుద్ధరూప మతిచోద్యము - పోలురు చెన్నకేశవా! 68

చ॥ కలిఁదుదినీవు గుఱ్ఱమున ఖడ్గముఁ బూనిన బ్రాహ్మణుండవై
యలరుచుఁ గల్కినాఁ బుడమియందలి దుష్టుల భూసురామలన్
బలిగొనువాఁడవందురనవచ్చున యిప్పుడు ముందుమాటగా
సలలిత శాంతరూప! విలసద్గుణ! - పోలురు చెన్నకేశవా! 69

చ॥ అవసరమైనయట్టి సమయంబులఁదాల్చిన రూపనామముల్
భవదవతారదివ్య విభవంబులనంతములెన్న శక్యమా?
దివిజులు భూజనుల్గని నుతించి భజించినరీతి వారికిన్
వివిధ ఫలంబులిచ్చెదవు వేమరు - పోలురు చెన్నకేశవా! 70

చ॥ ప్రతియుగ వేషమందు, నిజరమ్య విశేషగుణంబులఁజూపి సం
తత సుఖదాయకంబయిన ధర్మము వర్తిలఁజేసి, లోకముల్
మతివికలత్వము న్గననిమాడ్కిఁ జరింప హరించి పాపముల్
శ్రుతినుతిఁ గాంచినావు మధుసూదన - పోలూరు చెన్నకేశవా! 71

ఉ॥ నీవు పదారువేల రమణీమణులన్ వరియించి, కృష్ణలీ
లా విభవుండవైనఁ గనులంగని నారదమౌని, భక్తలో
కావన! నీదు మాయ గననయ్యెను ధన్యుఁడనంచు మ్రొక్కి పె
న్ద్రోవన జరించె; ధర్మనిరతుండవు - పోలూరు చెన్నకేశవా! 72

చ॥ అల శ్రుతదేవు విప్రు, బహుళాశ్వనిరాజు, ననుగ్రహింప వా
రల వెనువెంట నింట్లకుఁ బరస్పరము న్గననట్టులీవు, మా
నులు నొకసారిచేరిన వినోదముఁ, గొన్నిదినంబులుండి, పూ
జలఁగొను చిద్విలాస నుతిసల్పుదు - పోలూరు చెన్నకేశవా! 73

చ॥ పతివను సత్యభామ కతిభారము దోఁచఁగఁదూచ; నిన్, జగ
త్పతివను రుక్మిణీసతి కభారము దోఁచఁ, బదార్థభావనా
మతి ఫలదాయకంబని ప్రమాణముగాఁ దులసీదళంబు సం
గతిఁ దులఁదూగు కృష్ణుఁడవు గావొకొ? పోలూరు చెన్నకేశవా! 74

చ॥ గరుడుడు తిండి బత్తె మడుగండు కదా! రఘురామమూర్తివై
బరగిన వేళ నీవతని భక్తునిఁ దూరము సేయనేల? తా
భరమని మానినాఁడొ? గరువంబు వహించి వహింపఁడో నిన్
పరమరహస్యమిద్ది తెలుపందగు - పోలూరు చెన్నకేశవా! 75

చ॥ అమములఁ గోరనట్టి సనకాదులు నల్వురు సాధు వర్తనుల్
జయవిజయాఖ్యులన్విహిత చర్యల భక్తుల ద్వారపాలురన్
రయమున నీదు సన్నిధి నిరంకుశవృత్తి శపించి రెవ్వరేన్
నియతి నతిక్రమించి చననేర్తురె? - పోలూరు చెన్నకేశవా! 76

ఉ॥ సాధులు బ్రహ్మవాదులిడు శాపము తప్పదు వైరభక్తి మీ
రీధర మూడుసార్లు జనియించి చరింపుఁడు సాధు బాధఁగా
సాధన రూపముల్గొనుచు సన్నిధిఁ జేర్చెదనంచుఁ బంపితౌ!
మాధవ! నీకు నీవెగ ప్రమాణము? - పోలూరు చెన్నకేశవా! 77

ఉ॥ వాలినిఁ జెట్టుచాటుఁ గొని బాణమున న్వధియించి రక్కసీ
లోలనుబట్టి ముక్కుఁ జెవులుం దెగఁ గోయఁగఁ జేసి, శత్రుఁడౌ
గూలకము న్విభీషణునకుం దగలంక నొసంగె; రామ భూ
పాలుఁడు తత్ఫలం బెవని పాలగు? - పోలురు చెన్నకేశవా! 78

ఉ॥ ద్వారకవీడి యుద్ధవుని సైన్యముఁ దత్త్వమొసంగి బాపి, ని
ర్వైరి సుహృద్విభేద మతి వర్తిలు కృష్ణుఁడు తత్పదాబ్జముం
సారశరంబు నాటిన నిషాదు విషాదముమాన్పి బ్రోవఁగాఁ
గారణ మీనెఱుంగనిది కాదుగ - పోలురు చెన్నకేశవా! 79

ఉ॥ కారణ కార్యముల్ నిజమెకా యనునట్లుగ ముందు వెన్కలన్
నేసుపుమీర జూపు మహనీయులకైనను; సచ్చిదాత్మ ని
ష్కారణ రూపు నిన్నెపుడుఁ గన్బడనీయదు, జన్మ కర్మ సం
స్కారమనాది. మిథ్యయనఁగాఁ దగు? పోలురు చెన్నకేశవా! 80

చ॥ అనఘులు ద్రోణ భీష్మ విదురాదులు సూడఁగఁ గృష్ణుఁడా సభన్
గనులిడి విశ్వరూపమునుఁ గన్పుఱుపన్ ధృతరాష్ట్రుఁ డింతయున్
మనమున నమ్మెనా! తన కుమారుల నొక్కని నమ్మఁజేసెనా?
అనయుల నమ్మఁజేయఁగల నందువ? పోలురు చెన్నకేశవా? 81

ఉ॥ స్వామి! భవద్విధేయులగువారు శుభంబులఁ గాంచుచున్న చో
పామరులైన మూర్ఖులశుభంబుల పాలగుటేగదా సదా!
నీమహనీయకీర్తి గమనించిన పండితకోటి నిన్నెటుల్
కామిత కల్పకంబనఁగఁ గల్గును? పోలురు చెన్నకేశవా! 82

చ॥ అనఘ! సమస్త జంతు హృదయంబుల వర్తిలు నీవు భేద భా
వన గలవాఁడవైన, సమవర్తనమూ సమవర్తిసిన్గదా
కనవలె? సర్వమీవ యనఁగావిని కాంచెడు భాగ్య మెప్పుడే
ఘనునకు నెట్లు గల్గును సుఖంబుగ? పోలురు చెన్నకేశవా! 83

ఉ॥ సర్వము వాసుదేవుఁడను సంగతి ద్వంద్వ మతిక్రమించినన్
నిర్వచియింపఁ గాఁదగు ననింద్య చరిత్రుల కందువా? జగ
న్నిర్వహణంబుఁ జేయునది నీదగు మాయయ? నీవ? ఇద్దఱా?
నిర్విషయ ప్రపంచము గణింపవ? పోలురు చెన్నకేశవా! 84

ఉ॥ పాలను నీరు వేఱుపఱుపంగల హంసము నీవు ద్రావునా?
పాలను గ్రోలునా? ఉభయ పానము సేయున? రెండు వీడునా?
వీలునుఁ జాలునుంగల వివేకపుఁ బక్షి సృజించె బ్రహ్మ; తాఁ
జాలున తద్విభాగమును సల్పగ? పోలురు చెన్నకేశవా! 85

చ॥ ఒకపరి నిన్నుగన్న నరుఁడుజ్జ్వలయోగసమాధినిష్ఠచే
బ్రకటితుఁడై నిరంతరము బ్రహ్మ సుఖానుభవంబుఁజేయు నా?
సకలము నిష్కలంబను విచారముఁ జేయున, రెండుఁ జేయునా?
నికరపుభక్తి ముక్తుఁడయి నిల్చున? పోలురు చెన్నకేశవా! 86

ఉ॥ నీవె సమస్తమంచు మది నిశ్చయముగ్ గనినట్టివాఁడు, నా
నావిధ వస్తు రూపములు, నామము లన్యముగా దలంచునా?
నీవిభవంబు వేఱుగ గణించి భజించి వరింపనెంచునా?
శ్రీవర! నీదుసేవ నిరసించున? పోలురు చెన్నకేశవా? 87

ఉ॥ సేవక సేవ్యభావనలఁ జిత్తము లెంతయుఁ బల్లవించి, సం
భావితవాసనామయ సుమంబుల సౌరభముప్పతిల్లి, ద్వం
ద్వావిల కామితామిత ఫలాళి నొసంగి చెలంగు చుండఁగా
జీవుల భావవృక్షము నశించున? పోలురు చెన్నకేశవా! 88

చ॥ తమము రజంబునున్నయెడఁ దాపమొ కోపమొ తోఁచునట్లు స
త్త్వముగలచోట శాంతము నిదానముఁ దోఁచుట నైజమేకదా?
శమముఖసత్త్వ వృత్తుల వశంబున నుండెడు వారు ముక్తులా?
భ్రమఁద్రిగుణంబులన్నని వారల? పోలురు చెన్నకేశవా! 89

ఉ॥ నీతను వెన్నశాంతము, వినిర్మలభావయుతమ్ము, చేతనా
చేతన నిర్మితమ్ము, పరిచిహ్నిత దివ్య మహా ప్రభావ వి
ఖ్యాత చతుర్భుజాంచిత వరాయుధ భూషణ కాంతి కాంతముగ్
శ్రీతరుణీ విశిష్టము స్మరింతును - పోలురు చెన్నకేశవా! 90

చ॥ వరము లొసంగి పంపు సదుపాయముఁ జూడకు, వేడ్క నాకు దు
స్తర భవవార్థిఁదాఁట; నిడఁజాలవ నీపద భక్తినావ? ఇ
స్నర తనువాఙ్మనో గత గుణంబు పణంబుగ నీకు నిచ్చి, స
త్వరముగవిల్చి కొందును కృపానిధి! పోలురు చెన్నకేశవా! 91

చ॥ సురలు మునీంద్రులెల్ల నినుఁజుట్టి పొరింబొరి మ్రొక్కి వేడ, నా
సురవధకై యొకప్పుడతిచోద్య శరీరము నీవు దాల్పఁగా
సురలసురుల్మునీంద్రులదిచూచి స్మరించి తరింత్రునా; నిశా
చరులనిఁదాకి నిన్ననుట శ్లాఘ్యమ! పోలురు చెన్నకేశవా! 92

చ॥ తను గుణధర్మతుల్య ఫలదాయివి, మాయివి, యెప్పుడెట్టులే
తనువున నెద్ది యెవ్వరికిఁ దాల్చెదొ యెవ్వఁడెఱుంగు నిక్కమో!
యనఘ! భవద్విలాస విభవాతిశయంబుఁ గనంగ నేర్చునే
మునిజన దేవదానవ సమూహము? పోలురు చెన్నకేశవా! 93

ఉ॥ నీరజనాభ! కల్పనము నిక్కమనంగ వినంగ నౌనె? ఆ
ధారము లేని కల్పిత పదార్థము గల్గునె? సర్వ కల్పనా
ధార మనాది వస్తువు సతమ్మది నీవని కన్నవాఁడు, సం
సారము నమ్మి సత్యమని సల్పునె? పోలురు చెన్నకేశవా! 94

చ॥ తెలివి సమస్త వస్తువుల తీరునఁ దోచును, రూపనామముల్
కలిసివసించు; నిద్రఁగలఁ గన్నటు జాగరమందు భ్రాంతిచే
గలుగు జగంబు వాస్తవముగాఁ గనుపించుఁ బ్రబోధ సర్వముల్
నిలువమిఁగాంచు తెల్వియది నీవెగ - పోలురు చెన్నకేశవా! 95

చ॥ నరుఁడవివేకబుద్ధినిఁ గనంబడు వానిని వేఱువేఱుగాఁ
బరగినరీతిఁ జూచును; వివర్తమెఱుంగు వివేకబుద్ధి నిం
స్థిరమగు తెల్వి నీవనుచు దేనిని వేఱనఁబోక చూచు; సం
బరమది రెండు బుద్ధుల సమానము? పోలురు చెన్నకేశవా! 96

చ॥ హరిహర నామరూపముల నచ్చట నచ్చట భారతంబునన్
స్థిరముగ నర్చలన్నిలిచి దేవనరాదుల పూజలందుచున్
ద్దిరుపతులంచు క్షేత్రములు తీర్థములంచు భజించు వారికిన్
వరము లొసంగి చూపుదు ప్రభావము పోలురు చెన్నకేశవా! 97

ఉ॥ మానవ జన్మమెత్తి యనుమానములేని మనంబు నందగా
లేనియెడన్ గృతార్థతయు లేదు సరేగద, యెట్టి జన్మముల్
జ్ఞానము నందఁబోదు భవసాగర పారముఁ గానలేదు, స్వా
మీ! నిను భక్తిఁగొల్వమి క్షమింపుము పోలురు చెన్నకేశవా! 98

చ॥ కడచిన జన్మమందు క్షణకాలము నిన్ను భజించియున్న ని
ప్పుడొక ముహూర్తమైనఁ బ్రతిపూట భజింపకయుండ నేర్చునా?
పుడమి నరుండు నీభజనముఁ విడలేక జనించునేని యా
తఁడమృతుఁడౌను దావక పదంబున పోలురు చెన్నకేశవా! 99

చ పరమపవిత్ర నామము నెవండవశుండయి యుచ్చరించినన్
పరమపదంబునందు భగవంతుఁడె యాననఁగానిఁ కన్నిరం
తరమును నామరూపమననంబున నేమగునో వచింపఁగాఁ
దరమ? మహాత్మ! సర్వఫలదాయక! పోలురు చెన్నకేశవా! 100

ఉ॥ నామమహత్త్వమెన్నుచు, ఘనంబగు రూపవిశేష తత్త్వముఁ
నేమముతో భజించు నరునిం బరిహాసము చేయువారె, హో!
నామము రూపమే జగమనంగ బెనంగుచు నుండు వారిలన్
నీమహనీయ మాయఁ గననేరక పోలురు చెన్నకేశవా! 101

చ॥ ఇది, యదియంచుఁ జూచి వచియించునరుండు భవత్స్వరూపమం
దిది యది యిట్టులట్టులుగ నెప్పుడు జూపెడు నద్ది మాయగా
మదిని నొకప్పుడైన ననుమానములేక గనంగ, దానికిన్
దువియగు వానికిన్ మరలఁ దోఁచదు; పోలురు చెన్నకేశవా! 102

ఉ॥ నూరువిధాల నామననమునుం భవదీయమొనర్పయత్నమీ
తీరునఁ జేసితిన్ భవదధీనముఁజేసితి నీ స్వరూప మా
ధారము దానికింకఁ జవదాటదు శ్రీగురునాజ్ఞ; నేను ని
ష్కారణుఁడన్ జనన్ సెలవొసంగుము పోలురు చెన్నకేశవా! 103

ఉ॥ చాలును జన్మమిందుఁగనఁ జాలితి నీకృప స్వస్వరూప; మే
కాలము దేశకర్మములఁగాంచి వికారము నందబోవ, కే
మేలులుఁ గీడులెంచుచు రమించు మనంబది లేమిఁదృప్తి; శ్రీ
లోల! సమస్త మీవయి వెలుంగుదు పోలురు చెన్నకేశవా! 104

ఉ॥ కామిత మర్థమీతనువు గల్గుట నీకృపఁగఁటె; సంచితా
గామి ఫలంబులంద నవకాశ మొకింతయుఁ గానరాదు, నే
నేమియుఁ జేయనట్లు రుజువేర్పడెఁ దీర్పున సద్విచారణన్
స్వామి! కృతార్థుఁడ న్గానుము సత్కృతి పోలురు చెన్నకేశవా! 105

చ॥ పలుమఱు పేరుఁ బెట్టి పిలువంగనె వేడ్కనో! కిన్కనో! కనం
గలఁడు జనుండు, దేవుఁడవు గావున నిన్నిటులూరు పేరులన్
వెలయఁగఁబిల్చి నాదు మనవి న్వినిపించితి సంతసించెదో?
యలుకవహించెదో తెలియనౌనొకొ? పోలురు చెన్నకేశవా! 106

చ॥ వినయ విధేయతల్మనవిఁ బిల్పునఁ గౌరవ, మర్థభావల
క్షణములు మాటలందుఁ గనఁజాలనటందువ! దేవ! నిక్కమే
నిను నితరుండవంచు గమనించని తప్పు క్షమింపు, మేను నీ
వను పొరపాటు దిద్దుకొన నౌనిఁక పోలురు చెన్నకేశవా! 107

చ॥ జయజయయంచు నిన్ శ్రుతులు సన్నుతిఁజేయఁ బ్రసన్నమూర్తివై
వియదనిలానలాంబు పృథివీతతితో సకలంబు నేర్పనన్
నియమన మొప్పఁజేసి శరణీయుఁడవైతివి యెల్లవారికిన్
భయహర! బంధముక్తజనబాంధవ! పోలురు చెన్నకేశవా! 108

ఉ॥ మంగళరూప! నీవు పలుమాఱుధరించెడు దేహముల్ జగ
న్మంగళదాయకంబులను మానములేదు భజించువారికిన్
మంగళనామమన్నఁ బరమప్రదమేయగు; భక్తినిచ్చు శ్రీ
మంగళహారతు ల్గొనుము మాధవ! పోలురు చెన్నకేశవా!

చ॥ మనవి వినంగ నిన్ను బ్రతిమాలితి వేడ్క మదీయ వృత్త వా
సనగల చంపకోత్పలను జాతి సుమంబులనెంచి నూటిపై
నెనిమిదిగా నొసంగి క్షమియింపఁగ వేడితి; ప్రత్తిపాడు గ్రా
మనిలయుఁడన్ ప్రతాప హనుమయ్యను పోలురు చెన్నకేశవా!110

ఉ॥ శ్రీగురురామచంద్రయతి శేఖరు సత్కృప బ్రహ్మభావనా
భ్యాగత శుద్ధబుద్ధి నిను బ్రహ్మముగాఁగని సన్నుతించి, మా
యాగుణ కార్యమెల్ల బరిహాస్యము మిథ్యగ నెంచితిన్; దయా
సాగర! వేడ్కగైకొనుము సత్కృతిఁ పోలురు చెన్నకేశవా! 111

శ్రీ చెన్నకేశవార్పణమస్తు

శ్రీ విజయ సం॥ర చైత్ర శుక్ల ద్వాదశి.

–(౦)–

శ్రీరస్తు. — శుభమస్తు.

శ్రీశివాయగురవేనమః — శ్రీచెన్నకేశవస్వామినేనమః

# శ్రీ భూనీళా చెన్నకేశవస్వామి కళ్యాణము

శ్రీ చెన్నకేశవస్వామీ!! చెప్పెదఁ జిత్తగింపుమీ! నీకథగా
నీచిత్తమలర నలరును నాచిత్తము ముక్తబంధనమ్మగుచుసదా 1

క॥ మున్నెన్నఁగ నారదముని। వెన్నుని వైకుంఠమందు వేడ్కభజింపన్
గ్రన్ననఁజని కానకఁ దను। గన్నయ్యను బ్రహ్మనడుగఁగాఁ దలఁచివడిన్॥

తే॥ సీ॥ సత్యలోకంబునకుఁబోయి జనకుఁడైన
నాల్గు మొగములసామి సందర్శనమ్ము
రక్ష రక్షయటంచుఁ బ్రదక్షిణమ్ము
భక్తి సలిపెను సాష్టాంగవందనమ్ము॥ 3

తే॥ గీ॥ బ్రహ్మయును బ్రేమమీర నారదునిఁ గాంచి
శ్రేయమగు నీకటంచు నాశీర్వదించి
సర్వకుశలంబు విని మది సంతసించి
రాక యెందుండి యనఁగ నారదుఁడు వలుకు॥ 4

క॥ నాకమునుండి యెకాయికి – వైకుంఠంబునకువచ్చి వ్రాలితిఁదండ్రీ।
శ్రీకాంతుని భజనార్థము–నాకా హరి గానరాఁడనంగా నతఁడున్ 5

క॥ నారద! భక్తుఁడవుగదా, వారిజలోచనునిఁ గనవ వైకుంఠమునన్।
క్షీరాబ్ధియందుఁ గనఁగా బోరా, భూలోకమందుఁబోలూరునకున్!6

శా॥ శ్రీనారాయణమూర్తి భక్తులఁ గటాక్షింపంగ నూహించి, శ్రీ,
భూ, నీళా, ప్రకృతీ సతీయుతముగాఁ బోలూరు గ్రామంబునన్
జ్ఞానైశ్వర్యద చెన్నకేశవ సమర్చారూపుఁడై నిల్చె, ని
త్యానందామృత తృప్తులన్నలుపఁ దద్ధ్యానైక పారీణులన్॥ 7

చ॥ అనఘుఁడు దేవపూని, కమలాసను పాదములంటి మొ్రక్కి, ఓ
జనక! చనంగ నెట్లుడుగు సాఁగును? శ్రీపతి భూమి నీళలన్
గొని చనినట్టి వృత్తమునకు న్దగు హేతువుఁ జెప్పుకున్నచో
ననిన; విధాత గోప్యమును, నాత్మజుపైఁగల కూర్మినిట్లనున్॥ 8

మ॥ వినలేదా? సకలమ్ము మాయికమనన్, విష్ణుప్రభావంబునుం
గనలేదా! పలుమాఱు నాటకముగాఁ, గాలక్రమం బొప్పఁగా
మనలేదా! సుఖదుఃఖమ్ములనుచు సంభావింపుచున్, మాయకే
పనిలేదాయెను, గారణంబెఱుఁగ లాభంబుండునే నారదా!॥ 9

శా॥ నేనా విష్ణునినాభి పద్మమున జన్మింపంగ నేహేతువో
శ్రీనారాయణుఁడెట్టి కార్యమునకుం జేష్టింపఁగా నద్దియా
జ్ఞానానంద సదేకలక్షణ మధిష్ఠానంబునం గల్పితం
బీ నానావిధ రూపకార్యములు' మాయిన్మాయగాఁగందుమా? 10

శా॥ మాయాలాస్య విమోహితాత్ములమునుమ్మా! నేను విష్ణ్వీశులున్
హేయంబౌట యెఱింగియుం, ద్రిగుణకార్యేచ్ఛా ప్రసంగంబునన్
న్యాయార్థ ప్రతిపాదనార్థ విధివాదార్థంబు సార్థంబుగా
నాయారీతి మెలంగఁగావలసె జ్ఞానైశ్వర్యముల్గల్గియున్॥ 11

మ॥ వినుమా! వైష్ణవిమూలశక్తి. సిరి, పృథ్వీ, నీళ, నావేఱుగాఁ
గనఁగా నొప్పి, పరస్పరంబెపుడు రాగద్వేషముఖ్యాది భా
వనల న్విష్ణుని సన్నిధిన్మెలఁగ, సర్వజ్ఞుండు తచ్ఛాంతికై
చనెఁ బోలూరునకెల్లరు న్గొలువ నర్చారూపుఁడై నిల్వఁగన్॥ 12

క! హరియురమున శ్రీవత్సము। పరిమళ వనమాల, కౌస్తుభంబును, దులసీ
సరములు, సిరియును, మదినొండొరులను మెచ్చక వసించుచుందు
రెఱుఁగవా?

సీ॥ శ్రీవత్సమునుఁగాంచి శ్రీ, ధాత్రిగా నెంచుఁ
గౌస్తుభ ప్రభ తోడు-గాఁగ నెపుడు
గౌస్తు భమణి కాంతిఁ-గప్పును వనమాల
తులసీదళ ప్రజ్ఞ-చెలఁగి మెలఁగ
శ్రీవత్స మనిశంబు - శ్రీకౌస్తు భాదుల
భ్రమపెట్టు సుడియు స్వ-భావ మెసఁగ
గౌస్తుభంబన్నింటిఁ - గనఁజేయు సాక్షిగా
వెలుఁగుచునుండు వి-భిన్న రుచుల

తే॥ గీ॥ నిరతమిూరీతి నురమున - నిలిచి మెలఁగు
చుండఁ జిఱునవ్వునన్గను - చుండుఁ గాని
యొక్కదానిని విడఁడెంత - యోర్పు నేర్పు
లున్నవో! వెన్ను నందున - నన్నతండ్రి! 14

సీ॥ పనివడి వైకుంఠ - మును వీడి మత్స్యాది
విభవ మూర్తులు గన్న - విడువరైరి
వామన భార్గవ - రామ వేషములందు
బ్రాహ్మణ్యమునఁ గనఁ - బడక మనిరి
శ్రీరామ కృష్ణావ - తారఁబులను సిరి,
సీత, రుక్మిణి, యనఁజెలఁగి మెలఁగె
బుద్ధ కల్క్యాదుల - పూర్వ రూపంబులు
గనిన నుందురు హరి - ననుసరించి

తే॥ గీ॥ కౌస్తు భాదులు జడములు - కలిమి చెలియుఁ
బ్రకృతి, వీరితోఁగూడి య - ప్రాకృతుండ
నంగనొప్పు, విష్ణుండు వి - నంగ లేదె?
నారదా! నిర్మలుఁడు గగ - నంబు పగిది॥ 15

క॥ తనుఁగనవచ్చిన భక్తులఁ। గననీయండురముఁ గరయుగంబున నభయంబును, వరము, లిడెడు నెపమున। వనజాక్షుని హృదయ మెఱుఁగ వశమా? మనకుఁ॥ 16

క॥ ఇప్పటి కలికాలంబునఁ దప్పక నర్చాస్వరూపధారిగ హరితా। నొప్పిన సిరిమొదలగు వారప్పటి కలహంబుమాని యతిసమరస్థై॥

ఉ॥ భారతభూమియందు భగవంతుని యర్చలయందు, భక్తులే
తీరుననిల్పి కొల్చినను. దీక్షవహించి వరంబులీయఁగా
నేరుపుఁగన్నవారు, రమణీమణి శ్రీ మొదలైనవారు; పో
లూరునఁ జెన్నకేశవ సముజ్జ్వల రూపముఁగొల్చువారున్నై॥ 18

చ॥ అటఁగల స్వామివైభవ మహాత్మ్య గుణత్వ సమత్వ ధర్మమె
చ్చటఁ గనఁబోము. మెచ్చఁదగు సర్వవిధ ప్రభుభక్తి వర్తనల్
తటుకునఁబోయి చూచిన, ముదంబగు; నంతియకాక, నీకు నే
నిటనిటులెన్ని యో యభినయించినఁ గాంచిన యట్లులుండునే॥ 19

సీ॥ అందమైన యురమ్ము – నందలి సిరియుకా,
శ్రీ, స్వామి యనుమతిఁ – జెలఁగె నచట
శ్రీవత్స మొక ప్రక్క – శ్రీదేవి యన్నట్లు
భూదేవియయ్యె వి – భుండు మెచ్చ
కమనీయ వనమాలి – కా, తులసీసతి
భర్త్రాశ్లిష్ట నీళగాఁ – బరగె సరస
గౌస్తుభరత్న ప్ర – కాశమ్ము ప్రభుఁడెన్న
సర్వాంగ భూషణో – జ్జ్వలతనొప్పె
తే॥ గీ॥ ఏమిచెప్పుదు నారద! – యిప్పుడు విష్ణు
కీర్తి వైకుంఠమున నున్న – మూర్తికంటె
నధికమై యొప్పెఁ బోలూరు – నందు భక్త
వరదుఁడై చెన్న కేశవ – స్వామి వెలయ॥ 20
మ॥ మును దుర్వాసుని శాపమంది సిరి తామున్నీటిపాలైన, శ్రీ
వనజాతాక్షుఁడు, దేవదానవులతో వార్ధిన్మథింపంగ, సం
జననంబందిన శ్రీన్వరించి నిజవక్షంబిమ్ముగానిచ్చి, పా
వనరత్నంబగు కౌస్తుభంబు నెడదన్భాసిల్లఁగాఁ దాల్చెఁగా! 21
ఆ॥ వె॥ కమలఁగన్న వారు గంగా సముద్రులు। కాళ్లుగడిగి హరికిఁగన్నె నిడిరి
భూమినీళ లెవరిపుత్త్రికలనెదరో। వారు సేయఁదగు వివాహమిపుడు 22
క॥ భూనీళాపరిణయమును, శ్రీనాథుఁడు మెచ్చనిచ్చి చేసినవారల్।
శ్రీనాథులు భూనాథులునై, నీళాపతి సుఖంబులందుదు రెపుడున్ 23
తే॥ గీ॥ అనుపురాణ ఫలశ్రుతి వినినవారు। భూమినీళలఁ గేశవస్వామికిచ్చి।
పరిణయ మహోత్సవము జరుపంగలారు । బంధుమిత్రులతో మహా
వైభవముగ॥ 24
క॥ శ్రీవరుఁడు చెన్న కేశవ దేవుఁడు, వధువులును భూమిదేవియు, నీళా
దేవియుఁగాఁ గళ్యాణముఁ గావించెడు ముందు జరుగు గ్రంథము
వినుమా॥ 25
తే॥ గీ॥ భక్తులందఱు శ్రద్ధతో వచ్చి వరునివైపు కొందఱు; కొందఱు వధువు
వైపు । వారుగానిల్చి, కేశవస్వామి వైపువారితో భూమినీళలవైపు
వారు॥ 26

తే.గీ॥ భూమినీళల మాపుణ్యపుత్త్రికలను భక్తి, శ్రీచెన్నకేశవస్వామికిచ్చి
శక్తికొలఁది కళ్యాణంబు జరుపఁగలము, శీఘ్రముగ నందఱును దయ
చేయుఁడనిన॥ 27

ఆ॥వె॥ పుడమి పడఁతివలదు- పూఁబోఁడి సిరికద్దు। సేవ్యసేవకులను జిక్కు-
లొదవుఁ। గాన, నీళనిచ్చి కళ్యాణమొనరింపుఁ డనిరి చెన్నకేశ-
వునకు హితులు॥ 28

ఆ॥వె॥ చెన్నకేశవుండు శ్రీనాథుఁడయ్యును। భూమిఁ జేసికొనకపోవునేని।
నీళయెట్లు తనకు నీడగావర్తించు? సుఖముగీర్తి రెండుఁ జూరగొనఁగ

క॥ అని వధువులవైపున వారనిరయ్యుభయుల మనంబులరసిసభస్థుల్।
వినయముదోఁపఁగ, నిరుదెగ లనుకొనియెదరెటుల సభను నందఱు
వినఁగన్ 30

స్వామివైపువారు ఆ॥ వె॥ కదలమెదలలేని - కాంతనాకెందుకు?
అమ్మవారివైపువారు ,, ఎందుఁ దిరుగఁబోక నింటనుండ
స్వామివైపువారు ,, అడుగు నడువలేని యబల నాకేల?-
అమ్మవారు ,, మీయడుగులెపుడు విడక మడుఁగు లిడఁగ॥31

శ్రీస్వామివైపువారు ఆ॥వె॥ మందబుద్ధిభూమి; అమ్మవారు మామతిచంచల
,, కంపు గలది ,, మిగుల సొంపుగలది
,, బహుపతిత్వధర్మ; ,, బహుజనార్జితకర్మ;
,, సమత నెఱుఁగదెపుడు; ,, సమతఁ జనదు॥ 32

క॥ శ్రీదేవికిఁగల గుణములు। భూదేవికిలేవు వలదు పొమ్మనఁగా, నీ।
ళాదేవి సుగుణవతియని। గాదా తెలిసది: భూమి గైకొననెవరో 33

క॥ భగవంతుఁడయ్యు భక్తుల। సుగుణావగుణంబులెన్న చోనిఁకనితరుల్
త్రిగుణాన్వితమాయావృతులగువారా? స్థిరసుఖంబులందెదువారల్

ఉ॥ నీళసజ్జురాలనుచు నేను వరించి గ్రహింపఁగోర, శ్రీ
కేళియు చాలునాకుఁ, దిలకించినమాత్రన భక్తురాలుగాఁ
గూళతనంబులేనిదిగఁ గోచరమయ్యెడుఁగాన, మీరు, నీ
వేళకునీళనుండు పృథివిన్ మఱిమొక్కని కిందు పొందఁగన్॥ 35

చ॥ సరిసరి, యిట్టిమాట వినఁజాలరు భక్తులు నిన్నెఱుంగరా?
సరసిజమిత్రశత్రువు లజ్రసము సాక్షులు మీకు మాకునుఁ;
పరమపవిత్ర! యీధరణి పత్నిగ యజ్ఞవరాహమూర్తివై
నరకునిఁగన్న తండ్రివనినం జగమేమనుఁ జెన్నకేశవా?॥ 36

శా॥ ఆనాఁడే గతిలేక వేసిన వరాహస్వామి వేషంబు మా
టే నాఁడేటికి; దివ్యమూర్తినగు నన్నీభక్తులర్చింపఁగా
నేనీ భూపతి సేవలొల్లనన; ముందే చెల్లి పెండ్లాడవా?
యేనాఁడైననుకన్న? పెద్దమను నీవేముంచు గేల్పట్టవా? 37

శా॥ నేనే భూపతి, శ్రీపతిన్, విభుఁడనే - నేనంచు నజ్ఞానులై
నానాలోక సుఖాభిలాషులయి జన్మంబుల్గనం జాలువా
రేనాథత్తలు శ్రీకి భూమికీ, నిజం జేమాత్ర మింమున్నదా?
భూనారీమణి వద్దువద్దనకు మా-పుణ్యంబు నీపుణ్యమా॥ 38

ఆ॥వె॥ చక్కఁదనముఁజూచి - శాంతమ్ము గుణమెంచి
పిల్లనీయరాగఁ బెండ్లి కొనుడు । పెద్దపిల్ల మొద్దు -
చిన్నది ముద్దన్న । నక్కఁగొనక చెల్లి దక్కఁబెట్టు? 39

ఆ॥వె॥ అన్నమాటవిన్న - చెన్నకేశవహితు - లున్నవదియె జరుగ -
నున్నదదియె । చెన్నకేశవుండు-శ్రీవిభుండని కదా : భక్తి మనసము
పట్టు-బట్టుటసిరి 40

ఆ॥వె॥ అవును కాదనంగ-నవ్వున భక్తులకైన । స్వామి విహితకార్య -
చర్యలందు । ఆయిన స్వామిపెండ్లి - కందఱు పెద్దలే । నన్నమాట
నేఁడె - కున్నది గద॥ 41

తే॥ గీ॥ అనుచు శుభవాద్యములు మ్రోయ నందఱేక
మగుచు గంధపుఁబోడి గులాలందుకొనుచు
నెమరుకోలు మహోత్సవంబింపు మీర
జరుపుచున్నారు నారదా! జనులు గనుము. 42

క॥ అని బ్రహ్మచెప్ప నారద । మునిచయ్యన వచ్చిచూచి. మునమున
సభలన్। వినిపించెనిట్లు, దివిజులు । మనుజులు వినిచూచి ధన్య
మతులై యలరన్ 43

క॥ కృతికర్త, కృతియు గృతిపతి । క్షితిగల కాలమ్ము మనెడు -
శ్రీభూనీళా। పతి చెన్న కేశవుని కృప । నతుల సుఖారోగ్య సంపదా
నందములన్॥ 44

ఆ॥వె॥ శుభదవిజయ చైత్రశుక్ల చతుర్దశి । నీవివాహసరణి భావములరం
జెప్పి నిన్ను వలచి శ్రీచెన్న కేశవ! స్వామి వీవనాదు పలుకుం జెలికి॥ 45

సమస్త సన్మంగళాని భవంతు. — సర్వే జనాస్సుఖినోభవంతు.

రచయిత : ప్రతాప హనుమయ్య. (1953)

—: శ్రీ చెన్న కేశవ గ్రంథాలయము :—

ఉ॥ శ్రీమహిళా మహీసతులు జెల్వుగనీళయుం జెన్న కేశవ
స్వామిం నిగాంచి మీదు ప్రతిభారతి భారతి వల్లనేకదా
భూమినభోంతరాళ పరిపూర్ణము నా; వినినవ్వి స్వామి, యూ
నా! మనపేర గ్రంథనిలయమ్మభివృద్ధి యునట్లు యూనర్॥ 1

చ॥ కొడుకన బ్రహ్మదేవుండికం గోడలు భారతి మాటకారి, నా
పడతులు శ్రీయు భూమియును వాణిగణింపరటంచు విష్ణుండే।
పుడమినిం జెన్న కేశవ విభుండనం బోలుచు నందునందు, నె
ప్పుడుం దన పుస్తకాలయముం బోషణ జేయుచు; మాటపాటికై॥ 2

సీ॥ బ్రహ్మాది దేవతా ప్రభువరానందమ్ము
నందింపంజాలు గ్రంథాలయమ్ము
సకలలోకాధిప సామ్రాజ్య విభవమ్ము
నందింపంజాలు గ్రంథాలయమ్ము
అనుపమ సుఖ సంపదారోగ్య భాగ్యమ్ము
నందింపంజాలు గ్రంథాలయమ్ము
సన్మార్గ మైత్ర్యాది శాశ్వత లాభమ్ము
నందింపంజాలు గ్రంథాలయమ్ము

గీ॥ అష్ట నేత్రాంజనమ్ము గ్రంథాలయమ్ము
నవ్య విజ్ఞానదమ్ము గ్రంథాలయమ్ము
ధర్మ గుణ దాయకమ్ము గ్రంథాలయమ్ము
అఖిల సారస్వతమ్ము గ్రంథాలయమ్ము॥ 3

క॥ పలుకుంజెలి తలవాకిట । మెలఁగిన సిరి, భూమి, సుఖము మేలులు
సెలఁగున్। కలిమి చెలియింటనుండినఁ। బలుకుబడియు లేక సుఖముఁ
బడయఁ డెవండున్॥ 4

క॥ కామాదుల జెఱఁగి విడువఁగ। ప్రేమాదులఁగాంచి బుద్ధి-వృద్ధింగనఁగా
నేమంబున సుఖమందఁగ। గ్రామస్థులకుండవలయు గ్రంథాలయముల్

మ॥ జగతిన్ మానవులై జనించి తమ భాషాజ్ఞాన సంపన్నులై
మగువల్ పూరుషులొండొరుల్ మిగిలి సన్మార్గ ప్రవర్తాత్ములై
భగవంతుం డొకఁ డున్నవాఁడనుచుఁ గొల్వన్ జ్ఞాన వైరాగ్య భా
గ్యగతిన్ ముక్తులు గాఁగ నొప్పు; నితరంబైనం బశుప్రాయమౌ॥ 6

శా॥ కాలాతి క్రమణంబు వేదములకున్ గన్పట్టు, శాస్త్రంబులన్
చాలుంజాలనఁ గల్పనాకథలు భాషా ప్రష్టియున్ దోఁచు; ని
క్కాలం బెట్టులనుండు నంచునవి వక్కాణించెదున్మాదుగా
మేలుంగీడుల జాడఁ జూడవలయున్ నేర్పైన గ్రంథంబులన్॥ 7

సీ॥ బ్రహ్మ మొదలు పిపీలిక వఱకు జంతు । సంతతులు భావమెఱిఁగిం
చు శబ్దచేష్ట । భాషయగు; మానవుల్ దాని వ్రాయఁ జదువఁ
గలరు పశుపక్షులకుఁ జేతఁగాదు వ్రాఁత॥ 8

ఆ॥వె॥ నోటిమాటఁ జేష్టను గని భావమ్ముఁ గానవచ్చు నెట్టివానికైన
ఆడఁబోడ నేర్చి యభినయించెదునట్టిమాట వెలఁది కిదియు యగును
సాటి॥ 9

గుంటూరు మండల వేదప్రవర్ధక విద్వత్పరీక్షా సభాకార్యస్థాన
పురాణ పండితులు ప్రతాప హనుమయ్య బ్రాడీపేట, గుంటూరు.
శ్రీ విజయ నామ సం॥ర అధిక వైశాఖ శుద్ధ దశమీ

ఈ గ్రంథకర్త చే రచితములు

1. శ్రీ ప్రసన్నాంజనేయము.

2. శ్రీరామ వైరాగ్య కందములు.

3. శ్రీ సద్గురుస్తోత్రము.

శ్రీ జగద్గురూపదేశసారము.

అద్వైత తారావళికి తేటగీతానువాదము.

తెలివిబ్రహ్మము.

మాయ—జాయ (భార్య) మాయాప్రశంసలు

4. శ్రీ చెన్నకేశవ శతకము – కళ్యాణము
(అచ్చుకావలసినవి)

5. శ్రీ భ్రమరాంబా చెన్నమల్లేశ్వర శతకము.

6. శ్రీ వీరాంజనేయము.

7. శ్రీ సద్గురు పూజాకల్పము.

8. 'పచ్చీసు' ఆటయందలి పరమార్థము.

9. శ్రీ సులక్షణోపాఖ్యానము.

కల్యాణీప్రెస్, గుంటూరు-2.